105. ఇది సీతా హృదయంబు గాదలచి నేనీరీతి నీభాతి, యిం
పొదవన్ వ్రాసితి, విజ్ఞులైన సరసుల్ మోదాన మోదింప, నా
కదిమత్తేభము నెక్కినట్లుగును, పొంగారంగనామేను, ని
క్కెద వ్రాక్కుచ్చిన, తన్మనోజ్ఞమును వీక్షింపంగ వాంఛించెదన్

106. ఇదియేదోయొక దివ్యభావము మదిన్ యిన్నాళ్లు నన్నూడి, యు
న్నది సీతాసతి వేదనా హృదయమున్, నవ్యోక్తులన్ దెల్ప, నె
మ్మది నేనుంటిని, హృద్య పద్యరచనా మార్గాను రక్తుండనై
ఎదనూహింపుడు యెంత యెంతయనుచున్ యీనాదుకర్తృత్వమున్

107. ఇది యానాటిది గాదు దేశమున, గారింపంగనున్నారునే
డు దయాహీనులు పెక్కుమంది, దనుజుల్, దుర్మార్గ మార్గానుబ
ద్ధ దురంతార్థ హృదంతరాంతరులు, యీధాత్రిన్ మహాతేజ మె
య్యది స్త్రీజాతిని రక్షసేయు? యిది హేయంబంచు ఖండించుచున్

108. ఎదలో లోతులనుండి వచ్చినది, నాయీవేదనారూప మి
య్యది సీతాసతి వోలెలోకమున, మాయావాగురంజిక్కిదుః
ఖ దవాగ్నిచ్ఛట రూపఅంగకనమే? గర్వాంధులై, స్త్రీలతో
డిదిగా జీవనమంచు యెంచు ఖలులన్, డిందింపగానెవ్వరో!

109. శ్రీ సీతారామకథా
రసోదధి మునింగి నేను వ్రాసితిదీనిన్
ఈసాహిత్య ప్రక్రియ
ప్రసిద్ధమై పొదలనాంధ్ర వాణినుతింతున్



# జ్వలిత సీత



రచన

"కవికులాలంకార"

"కవిరాజు"

కీ.శే॥ అలంకారం కోటంరాజు

# జ్వలిత సీత

రచన

"కవికులాలంకార"

" కవిరాజు"

**శ్రీ.అలంకారం కోటంరాజు**

1. మది నీవేదొ తలంతువేమొ! మునిసన్మాన్యుండు రాముండు, నీ
పది శీర్షంబులు, ద్రుంచకన్, వదులునే? పాపాత్మ! యీచెయ్ది మెం
తది యంచెంచక జేసినాడవుర! సీతాదేవికై వచ్చె, న
య్యది కోదండ గుణారవంబె! అసురా! యగ్నుల్ యింక వర్షించురా!

2. మదినైచ్యంబని యెంచకన్, వనములో, మారీచుతోడ్పాటుతో
గద, మారాముని, లక్ష్మణున్, భయదయుగ్రాకారులన్, మోసపు
చ్చి దురాత్మా! కొనితెచ్చినాడవు కదా! సీతన్వనీవీధి, న
య్యది కోదండ గుణారవంబె! అసురా! యగ్నుల్ యింకవర్షించురా!

3. ఇది కల్పాంత సుఖంబు నిచ్చుననుకొంటే! తుంటరీ! యెంత, నొ
వ్విది, కల్పించునొ, నీవెఱుంగవు కదా! విస్పష్టమౌనింక, చా
వదె మండోదరి, రాముురాక విని, విభ్రాంతాత్మయై, వచ్చెన
య్యది కోదండ గుణారవంబె! అసురా! యగ్నుల్ యింక వర్షించురా!



100. పదనౌబాణములా? సహస్రములు, సంభావింప త్రేతాగ్నులై
యెదమండించును నీకు, లంక దనుజుల్ యీల్గంగ నేవంక, న్య
ర్బుదముల్ శాత శరాగ్ని వ్రాతములతో ముంచంగనున్నాడు, య
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

101. బదులే లేదిక, రామవహ్ని, పృథివీ పర్యాప్తంబుగామండి నిం
డదె నీగుండియ, రాముడీశ్వరుడు, గాఢంబౌచు దీపింప, ద
ర్మదుడౌ నీదగు భస్మమున్ యలదులే మైనిండ, మోదంబునన్
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

102. అదురున్ దిగ్నిచయంబు, యంబుదములున్ యభ్రంబు శుభ్రంబుగా
తుదకున్ బ్రద్ధలుగాదె! రావణుడ! శాతోగ్రాభ పుంఖద్యుతిన్
కదలాడున్ యికనీ శిరోగ్రముపయిన్ కాకంబులున్ ఘూకముల్
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

103. మొదటన్ నిర్భరనంగతాపమది, నిన్ ముంచెత్తె, కించిత్తు, నుం
డదు నాయయ్యది, దుష్టదానవ నిగూఢార్థుండు రాముండు, నిన్
చదలన్ జూడగ, దేవతాళి నరకున్ శస్త్రాళి నీశీర్షముల్
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

104. ఇది రామాయణమౌనొ! కాదొ! ప్రజకున్ యిష్టార్థ సంధాయిగా
ఇది సీతాయణమౌను, సర్వమహిళా ప్రీత్యర్థమై పొల్చి, శా
రద చాంద్రీమయ కీర్తితో తెలుగులున్ రాణింతురిద్ధాత్రి, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

96. చదువుల్ యెందుకు, సాములెందుకు, దయాశౌచంబులింకేల? నీ
తి దయాహీనులు మీరు, రాక్షసవిభూతిన్ సాధ్వులంబట్టి, పె
ట్టుదురే? బాధలు సత్త్వహీన! యికటాటోటెట్లు సాగింక, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

97. ఉదయంబైతివి బ్రహ్మవంశమున, సాహోయంచులోకాలు, నీ
పదయుగ్మంబు భజింప, స్వర్గసుఖ సోపానంబు లారూఢిమై
అదె నీవెక్కినవాడవోయి! దురితాత్మా! దుష్టపుంజేత, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

98. అదిగో రాముని కీర్తి జ్యోత్స్న, కనుమా! యయ్యామ్న దిగ్భాగమం
దుదయించెన్, సుమనోభిరామముగ, ఖద్యో మండలంబెల్ల నిం
డి దివంబిమ్ములసాగె, నిన్నతడు గుండెల్ గ్రుచ్చి మండించు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

99. మదమత్తేభము భంగి బొంగి, కనులన్ మత్తెక్కి, చిత్తంబులో
గదియన్ దుర్మదవృత్తి, యిత్తతిని, మూర్ఖా! నన్ను మాయావివై
కద నన్నిట్టులతోడి తెచ్చితివి, సంగ్రామోర్వినీచావు క్రై
యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



4. ఇది నిస్సంశయ మింక, నిట్లు జరుగున్, రేద్రిమ్మరుల్ లంక, నీ
కదనంబందున, నంతమయ్యెదరు, యంగారంబులాముల్కు , లా
తుదరామోగ్రశరాళి చచ్చెదవురా! దుర్మార్గ! నీవింక, న
య్యది కోదండ గుణారవంబె! అసురా! యగ్నుల్ యింక వర్షించురా!

5. సదనమ్మైనది లంక రాక్షసులకున్, సౌవర్ణవప్రాళితో
కదియన్‌రాక మహేంద్రుకైనను, మహోగ్రంబౌచునెన్నోసమల్
ఇది యీనాటితొదీరె, రామశరవహ్నిన్ దగ్ధమైపోవు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

6. ముదమారన్ మునివేషధారియయి, కౌమోద్వృత్తి దీపింప, నీ
యెద, కాంతారము నందు కాంతనునసున్ యేతెంచిగైకోవె? సు
వ్విదిలంకాపురి చేటుగా పొలిచె, నీవేకారణంబౌర! య
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

7. పదికోట్లో పదివేలకోట్లోయసురుల్, ప్రాణాల నర్పించి, నిన్
కదనానన్ పరిరక్ష సేయుదురె? సంగ్రా మోర్విరామీశు బా
ణదవాగ్నిన్ శలభంబులట్లగురీ నామాట తథ్యంబు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

8. తుదయేమౌనొకొ! యంచునెంచకను, యత్యుగ్రంబుగానీవు, సా
ర దయారాశికి, రామమూర్తికి, సుధారమ్యోక్తికిన్ దుఃఖమున్
పదనౌ రీతి ఘటించినాడ వదియే? ప్రాణాలకున్ దెచ్చె, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

9. ఎదలో కామము గూడు గట్టి, ముదితన్ యేమార్చి, నీ విట్టులన్
సొదయింతైనను, యాలకించకను, నీశూరత్వమేపార, యం
గద! తోడ్తెచ్చుట గాదు, చూడుమదె, లంకాపట్టణంబెట్టులౌ?
నది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

10. చదరంగంబనుకోకు, రాఘవులతో సంగ్రామరంగంబు, నీ
కది మృత్యోన్ముఖమౌచు పొల్చు, నట కాంతారంబునన్ మున్ను, త
ప్పిదమైపోయెను, రాము దృష్టిబడకన్, భీరుండ నీపుణ్యమ
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

11. ముదితన్ దెచ్చిన మూర్ఖుడీతడని, యీముల్లోకముల్ జెప్ప, నీ
కదిసుంతైనను బాధలేద దనుజా! గర్వాంధమింతేల? నీ
కిది ప్రాణంతకమైదలిర్చె ఖలుడా! యేయింతియున్ తల్లియే
అదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



92. పదనౌ ఖడ్గమదేల? నీకు, యిదె! నాప్రాణంబులన్ దీయ, నా
పదసంఘట్టనమేల? యౌదుగఖువన్, బాధేల? వాదేల? నిన్
పదనౌ బాణపరంపరన్ బఱపి, చంపంగన్. యతండుండె, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

93. ఇదియేమంతటి పట్టణంబిలను, నీవేమంత దైత్యుండ, వా
గదు నీసైన్యము నీదుశక్తి యదె! మాకాకుత్స్థుడాయింతనిన్
గదియన్ జూచిన చాలు, భస్మమయి వేగన్ బోవె? యింతేల, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

94. తుదకున్ వచ్చినదంచు నేతలచితన్, దూరంబు గాజూడ,నే
దది ప్రారంభమటంచు నెంచెదను, గాఢాంధమ్ములో జిక్కి ని
క్కెదవేలా? కకుబంతకాంతలదె! తామింపొందు నీచావుకై
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

95. నిదురన్బోయిన మేలు కొన్న యెపుడున్ నీచావుకై యెల్లరున్
మదియా మాధవు నిల్పినారు, జగతిన్ మన్నించు నాస్వామి! యా
గదు చావింకను, మానినీహరణ! యాగధ్వంసకా! యద్ది, య
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

88. ఇదియుద్ధాంతము గాని తేలదు, దశగ్రీవా! విదేహాత్మజా
మృదు వాక్యంబులు నీ చెవింబడవు నీమీదుండు వాత్సల్యమున్
కదనే చెప్పితి, తత్త్వ వేత్తవు సుమా కర్తవ్యమూహింపు, మ
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

89. కదనానన్ జయమాశవీడుము, నిజాంగంబెల్ల యింతింతలై
కదనోర్విన్ వెదజల్లగాబడును, నీకాంతల్ రవంతైన, రూ
పది కాన్పింపక, వంతనొందెదరు, కావన్ యేరునవ్వారి, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

90. కదలెన్ కోతులపిండు, గండశిలలన్, గ్రావంబులున్ వృక్షముల్
చదలన్యాడుచు, ఛద్మవేషములతో, సాధ్వీమణుల్ బట్టు తం
తది యీపై నిక చెల్లబోదు, యిక నీతండంబు బూదౌను, య
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

91. ఛిదురంబయ్యది మొక్క వోయినది, నిన్ భీమంబుగాదాకి, య
య్యది నీగర్వముగాని, రాఘవుని యయ్యస్త్రాళి, పుత్రాళితో
కదనానన్ నిను రూపడంచు, విను, దోర్గర్వంబు మాయించి, య
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



12. మొదటే కాంతలబట్టినప్పుడె, నినున్పూర్ణాహుతిన్ జేసిననన్
యిది సీతాసతి వంతు వచ్చునది, కాదే? నీదు చావెంత, గొ
ప్పది, శ్రీరామునిచేతనౌట, యవురా! పాపాత్మ! నీపుణ్యమెం
తది, కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

13. చదునైపోవదెలంకయింక, దనుజా! సందేహమా? చూడు, నీ
రదసంకాశుడు, రామచంద్రుడు, శుభారంభుండు, సంరంభి యై
చదలంటంగను మ్రోయకీశతతితో, సౌమిత్రితోవచ్చె, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

14. గుదులైవచ్చెను కోతిమూకలవె! లంగూలంబులన్ యెత్తి, న
య్యదె దృగ్గోచరమయ్యె, నీకునవియేనత్యద్భుతంబౌచు, నం
బుద వ్రాతంబులవోలెముంచు, దితిజుల్ బ్రుంగంగ, వృక్షాళితో
నది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

15. హృదయాహ్లాదమునేటితో కలిగెరా! శ్రీరామచంద్రుండు, యం
గద సుగ్రీవులు జాంబవంత హనుమల్, గంభీర వారాన్నిధుల్
ముదమారన్గొని వచ్చి నిల్చెననికై మూర్ఖానినున్ జంప, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

16. గుదులై వచ్చెడి రాక్షసాళి, ననిలో, ఘోరంబుగాద్రుంచి, శా
రద జ్యోత్స్నామల హాసపంక్తులెలమిన్, రాజిల్లుకీశాళి, యా
గదు, లంకాపురి కంధిలో కలుపకన్, గర్వాంధ!చూడట్లె,న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింకవర్షించురా!

17. తుదలేనట్టి వ్యధన్ ఘటించితివిరా దుర్మార్గ! ధర్మంబుయి
య్యది కానేరదు, మాతృదేవతను, యన్యాయంబుగాదెచ్చి, న
న్నిదె దుఃఖానల మందు ద్రోచితివి, సుశ్రేయంబదె ట్లబ్బు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

18. పొదలున్ కీర్తిలతా వితానములు, పెంపొందంగ, దిగ్భిత్తులం
దు దవాగ్నిచ్ఛటలన్, నవారితముగా, దుశ్శీలుడౌ నిన్నుచం
ప దశాస్యా! దరికొల్పె, రాఘవుడు, యా బ్రహ్మైన రక్షింప, ద
య్యది, కోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

19. మొదలున్ యేతుదలేని వాడతడు, నీ మోహాంధ మింకింప భా
స్వద చాపోగ్ర శిలీముఖంబులను, శశ్వత్కుండలోద్భాసి యై
గదియన్ వచ్చెను, కీశయూధముతొ, సంగ్రామోర్వి యీనాడు, న
య్యది, కోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



84. కదనమ్మేమి ఫలంబునిచ్చునిక, స్వర్గంబొందు గాకుండ, నీ
కదిరా! నామదినిచ్చగింపదు, యహంకారమ్ముతో క్రు
ళ్లి దశగ్రీవ! కృశింపగాదలచి, నేలెక్కింతు కాలమ్ము న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

85. ఇదియాశూర్పనఖా ప్రభావమునుకొంటే! నీదుతెల్వేది, కూ
డదు శ్రీరామనితోడ వైరమని నాడాడంగ, మారీచునిన్
పదనౌచూపుల జూచి వాని గొనిరావా?వచ్చెనీవంతు, య
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

86. ప్రదరంబుల్ చనుదేరునింక, యికనీ ప్రాగల్భ్యముల్ మాను, కా
నదు నీబుద్ధి యొకింత సిగ్గు, యదుగో నానాస్త్రసంవేది, నీ
రద సంకాశ మనోజ్ఞ దేహుడు, ప్రభాలావణ్యుడై వచ్చె, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

87. విదితంబైనది వాని విక్రమము సువ్వీనాడు, లోకాన, సా
గదు యౌద్ధత్యము వాని ముందు, నిను నీకామంబు కాండోద్ధతిన్
తుదముట్టించును, నీదులంక కడలిన్ దూకించు నూగించి, య
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

80. మదిరాపానము సేయుచుంటివొ! వృథామాటల్ యిదేలయ్య, నీ
యెదశోధింపుము, యన్యకాంతలను, యిట్లీరీతి బాధించి, వా
రదె యా(క్రోశమొనర్ప పొల్పగునె? సారాచారమా? నీకు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

81. కదలెన్ కాలుని దున్నపోతు, మెడలో గంటల్ నటింపంగ, నీ
యెదలో మృత్యువు నర్తనంబు సలిపెన్, యింకేల, దర్పంబు, దు
ర్మదుడొ నీకు, నదెట్టు దప్పదిక, బల్వంతంపు, యీచావు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

82. ఇది నీ దక్షిణ నాయకత్వమునకున్ యింపౌనె? స్త్రీ మానసం
పద నీరీతిని కొల్లగొట్ట, యరరే! భాసించునేకీర్తి, ని
ల్వదు నీప్రాణముసుంతయేని, యిక శూరత్వంబుయేపాటిదో!
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

83. ఇదె నీభార్యనెవండొ బల్మిగొనిపోయెన్, యామెకవ్వాని పై
యెదలో నెంతదవానలంబు రగులున్, యీవింత యూహింపుమా?
అది యే నాయెదగూడు గట్టెనిక, నయ్యబ్జాక్షుడే దీర్చు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



20. ఇది జీవన్మరణంబునీకు, వృధగా యింతుల్ సుతుల్ చుట్టముల్
పదినీశీర్షములన్ నశించునిక, యీభర్మ్యంపు హర్మ్యంబులున్
చదియన్ లంకవినాశమౌనుగదరా! శాతోగ్ర పుంఖద్యుతిన్
అదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

21. సుదతిన్ బల్మిని బట్టి తెచ్చితివి, యాసూర్యేందు తారంబుగన్
పొదలున్నీకప కీర్తి, చత్తువిక యీ భూజాత నీ జాతకం
బది చాపానల పంక్తి తోడ, నొసటన్, వ్రాయించు శ్రీరాముచే
యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

22. ఇదిగాకేమి యొనర్తువౌర! ఫలితంబీవిప్డు చూడంగ నౌ
మదిరాక్షుల్ పృథు రాక్షసుల్ యగుచు నీ మాంసంబు రుచ్యంబుగా
పొదలన్ తిందురు క్రోధ మాసవముగాబొంగారగా ద్రావి, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

23. విదితంబైనది నీ ప్రతాపము, మృషా వేదాంత విజ్ఞాని! భూ
తదయారోచులు నీ యెదన్ ముసరె నే దర్పంబు నీ కేల, వ
ట్టిది లోజూపది యింతలేక యిపుడట్టిట్టయ్యె నీ ప్రాణ, మ
య్యది కోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

24. ఇది దేవేంద్రుని తోడి సంగరముగాదే! చూడు మాయింక, నీ
కిది సంగ్రామము తొల్తనేదెలియు, నాయీ చెప్పు వాక్యార్థముల్
రొదలౌజూవె నిజాంగనామణుల యాక్రోశాలు నల్దిక్కులన్
అదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

25. అదె వచ్చెన్ రఘురామమూర్తి సొగసుల్ యస్తోకమై పర్వె పెం
పొదవన్ నీరదనీల కాంతి కిరవై భూ పుత్రి నౌ నాకు, తొం
బది రెట్లాయెను, సంతసంబు పృథు నిస్వానంబు గా మ్రోగు, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

26. పొదయై పూచిన పొల్పుదోచునదె, నీపూబోడి మండోదరీ
ముదితారత్నముగేహ సీమ మిగులన్ మాన్యక్రియా సంస్థితిన్
కదియన్ వచ్చు మనోజ్ఞరాగరసమున్ కార్ల్దోచితేమూఢ! య
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

27. అది సమ్మోహన మంత్రరాజ మగుచున్ యారాధ్యమై పొల్చు, య
ట్టిది శ్రీరాముని నామ సంస్మరణ వింటే! రావణా భ్రాంతి వీ
డి, దయావార్ధియతండుగైకొనును, ప్రార్థింపంగ, లేకున్న, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



76. ఉదధిన్ దాటినయట్టి యుజ్జ్వలుడు, నీయూరెల్లగోలెత్తి, యే
ద్వదె, మండించగ నాతడే, హనుమ! సంభావించుమా? వాని, త
ప్పదు నీనాశము వాని చేతరఘుభూపాలుండె, పంపించు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

77. ఇదియీజన్మకు నెత్తినట్టి ఫలమంచెంచంగ నెవ్వాడు? పెం
పొదవన్, తద్గుణ రాజితోడ ధరనొప్పున్ వాడె విజ్ఞాని, నీ
కిదె మేలైనది? మాసెనే తెలివి? చావింతొప్పునామూఢ! న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

78. పదసంగ్రామము, చేరువైనయది, యోపాపాత్మ! నీ యాత్మలో
నిదియోచింపుము, యెందరెంద రసురుల్ హీనంపు యీచావు నొం
దెదరే? కాద, మనోజ్ఞమైన బ్రతుకుల్ దీరంగ, నీచావుకున్
అదె కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

79. ముదుగైపోయెను, భక్తి శ్రద్ధలు, మృషల్ ముంగొంగు బంగారమా
యె, దయావార్ధులు లేరు, యెవ్వరు, విచారింపంగ నన్యాయ మే
గద! రాజ్యంబిట యేలుచుంట, చెడుగా! గర్వంబు యెన్నాళ్లు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

72. ఇదినీదైన్యముతెల్పుచున్నయది, నీ యీగుండెలోబాధ, యెం
తదొ కూర్చుండక నీయకన్, మెదలె, చింతాక్రాంతమై మోము, యిం
తది యావంత భరించలేక, నను సందర్శింపగావచ్చితే!
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

73. అదియా రామునిగాక, యొండొరుల కభ్యస్తంబుగాలేదు, నీ
పదిశీర్షంబులు, వంచి, స్వామి పదముల్, బ్రోవంగ కైమోడ్చు, న
య్యది రక్షించు, భయంబు బోనడపి, నీయార్తిన్ విదారించు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

74. అదె సౌమిత్రి పరాక్రమక్రమము నాదౌదైన్య కంఠధ్వనిన్
విదితంబౌనటు నీకు జెప్పుజనదున్, విఖ్యాతమే యద్ది, యెం
తదిలేయంచనుకోకు, నీయుసురులన్, దర్పించి తీయున్, నిజం
బది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

75. ఉదయార్కున్ యెవడేని యాపుటకునుద్యోగించునా? భ్రాంతి,వ
ట్టది, యాచేతకుపట్టు లేదు, శరధాటీకుండు, యాతండు, ని
య్యది సుంతైనను తేరి జూడుము, కడున్ వ్యగ్రుండు, క్రోధించె, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



28. ఎదియో సల్పపుటూహజేసి, నరుగా శ్రీరాము భావించి, దు
ర్మద వృత్తిన్, ననుదెచ్చినాడవు, మదోన్మత్తా! తరింపంగ,త
త్పద రాజీవయుగంబు, దిక్కనుచు సంప్రార్థింపు, లేకున్న, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

29. కదనానన్ కడముట్టలేవు, యదియాకాకుత్థ్సుతో నాజి, ము
న్నిది నీవిన్నది గాదు, చూచినది కానేకాదు, సందేహమ
న్నది లేదెందును, నీదు చావునకు, నానాస్త్రాళితో వచ్చె, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

30. సుదతీరత్నము నన్ను దెచ్చితివి, యా సుగ్రీవుతో రాముడ
య్యదెతావచ్చెను, లంక చుట్టుకొనె, రౌద్రాకారుడైనేడు, యె
య్యదియో దారిక, మృత్యుగహ్వరము నాహా! జొచ్చితేయిప్డు, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

31. అదనంచెంచితి వీవు నాడు, ననుమాయావ్యాజమున్‌దేగ, తా
నదనంచెంచెను రాఘవుండు, నినుదివ్యాస్త్రాళిముంచెత్త, ని
య్యది, నీచావుకు నెత్తికోలు యగుచున్, యత్నంబుగాగూడె, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

32. పదినాళ్ళైనను గానులేదు, వనధిన్ బంధింప కీ శాళికిన్
పదనౌగోళ్ళను దంతముల్ గలవు మీ ప్రాణాలు తీయంగ, యెం
తది యీకోతుల మూకటంచు, మదిలో తల్పంగబోబోకు, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

33. ముదితన్మూర్ఛుడవౌచు దెచ్చితివి, కామోద్రేకివై, లోకమం
దిది నీకీర్తికి మచ్చదెచ్చె, కడునాంధీభూత చేతస్కమై
నది గాదే! యిది, నిన్నుగావయతడే, యారాముడే! నౌను, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

34. తుదయైనప్పుడు చెట్టబుద్ధులొదవున్, దుర్మార్గముల్ హెచ్చు, లో
తిది యంచెంచడు, యెవ్వడేని, పిదపన్ధీశక్తి గోల్పోవు, బె
ట్టిదమైనట్టివి, మృత్యుదంష్ట్రి కలనట్టే నల్గునవ్వాడు, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

35. పదియౌమస్తకరాజి వ్రచ్చు, తుదనీపట్నంబు భస్మంబగున్
యెదమండోదరి, యింద్రజిత్తునకునై యేడ్చున్, ధరాజాత్మ! యెం
తదియంచెంచకు, వంచకత్వము దురాత్మా! సాగబోదిప్డు, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



68. చదలందాడును, యట్టలౌచు తలలున్ శస్త్రాలనస్త్రాలతో
వదలంబోవదు, లంకనింక, కడుదావా భీలుడాతండు, చెం
దదునీకింతయుగూడ సీత, చెడుగా! దర్పంబునీకేల, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! దుగ్నుల్ యింక వర్షించురా!

69. ఎదలో లోతులనేమెఱుంగుదువె? మాయీ దంపతుల్ మధ్య, నీ
కిది దుస్సాధ్యము, చోద్యమౌనువిను, సంక్లిష్టంబు కన్గొంట, మా
యది జన్మాంతర బంధమైదనరు, నీకాగాథయింతేల? న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

70. పదిలోనన్ పదకొండువయ్యెదవు, యాపద్మాక్షుతో చావ, నం
తది గాకెంతదియౌను, రాఘవుడు, యాతండెన్న దైతేయ! సా
గదు నీశక్తియు, యుక్తియున్ యదియె, సంగ్రామోర్వి విన్మింక, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

71. అదివైశ్వానరమూర్తి, రామునిది, మాయల్, మంత్రముల్ యెవ్వియో!
గదియన్జేరవు, చేరెనా? యవియుభగ్నంబౌను? గాకేమి? నీ
విది యెంతేని యెఱుంగ నేరవవురా! విప్రుండవేనీవు! న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

64. కదియన్ వచ్చిరి, దేవకాంతలదె! ఢక్కాభేరికానాద మిం
పొదవన్, స్వాగతగీతముల్ వరలగా, పూర్వామరా! భోగ్యమై
నది, నీకిచ్చుట వీరస్వర్గము, నవానందంబు జేకూర్చు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

65. కదియన్ రాదుర యుద్ధమందు నతనిన్ కాకుత్థ్సు, నీ వేల్పుకం
దదు, యావిద్యరవంతయేని, శరసంధానంబునన్దిట్ట! యి
ట్టిది, సంగ్రామములందు జూడవు, లలాటేక్షుండు దానౌను, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

66. గుదియల్ గాగను గ్రుచ్చి రక్కసుల, సంకోచింపగానేల, యి
య్యదనున్, తాడితమైననాగము గదా! యారామభద్రుండు, లో
యెద కోపానలగుండమై పొదలు, వాడెంతంతగావిన్ము, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

67. ప్రదరాళిన్ నిను ప్రచ్చునాడు, శరముల్ పల్మారు నీ గుండెలో
కదియన్ జొచ్చినవేళ, నీకెయడగున్ గర్వాంధమాయెల్ల, న
య్యది యేనాటికొకాదు, నేడెయగురా! యప్రాచ్య సంస్కార, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



36. మదనారాతిని భక్తితోడ యెదలో మన్నించి, పూజించి, బె
ట్టిద మౌరీతిని కంఠలుంఠన క్రియాదీక్షానిబద్ధంబుగన్
ముదిత స్వాంతముతోడ వ్రేల్చవె! తలల్, మోహాంధ మిట్లయ్యె, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

37. ఇదియంధత్వముగాక తెల్వియెశుభశ్రీలుల్ల సిల్లంగ, లం
కది వారాత్రములెంతొ సౌఖ్యముననీకాంతాసుతుల్ గూడి, నె
మ్మది నీవుండక, రాముతోడ పగయా! మందుండ! నీచావుకై
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

38. కుదురై కూర్చొని యూరకుండక, దయాకూపారమారాము, దు
ర్మదవృత్తిన్గికురించి, సీతగొనిరా, మార్తాండుడైనాడు, యె
ట్టిదొనీ జాతకమిష్డు, స్వామి శరకోటీరుండునై పొల్చె, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

39. చదలన్దా కెడివార్థివీచికలతో, సంవృత్తమై యొప్పు, న
ట్టిది యీలంకయటంచు దెచ్చితివి, బోటిన్చేటుగామారె, న
య్యది ధీసారుడు, రాఘవుండు, విడునే యత్నంబు నిన్జంపకన్
అదికోదండగుణారవింబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

40. మదనుండా! మదినారియా? యెవరురా? మార్గమ్ము బోధించి, రి
ట్టిది సాధ్వీమణులట్టు దెచ్చికడు రెట్టింపైన కామమ్మునన్
ముదితల్ మానము ప్రాణముల్‌గొనెడి యామోహంబు బోకార్చు న
ట్టిది కోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

41. ఇది లోకాద్భుతకృత్యమై దనరునా? యిష్టార్థమీడేరునా?
ఇది సంస్కార విహీనమైన పనిరా! హీనాత్మ!పూబోడులన్
కదియన్ జేరిటు బల్మిబట్టనగునే? కళ్యాణబట్టసంధాయియే?
అదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

42. ఇదియెవ్వానికినైన పాతమగు, యేయింతిన్ మదోద్వృత్తి మై
కదియన్ రాడిక, రామురామకథ, తార్కాణంబుగా నిల్చు, య
ట్టిదిరా! రావణ! నీ వధంబు, జగతిన్ దీపించుచున్ నిల్చు, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

43. సొదతీరెన్, మధురోహలుప్పతిలె, నాశోకానలంబారె, య
ట్టిది శ్రీరాముని రాక నాకు, పృథుధాటిన్ పుంఖితంబౌచు, ని
య్యది లంకాపురి కాకగృధ్రతతికిన్, యావాసమైపొల్చు, న
య్యదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



60. సొదయెంతేనియు, యుండబోవదిక, యీశోభాధరిత్రీస్థలిన్
పొదలున్, లోకమునందు శాంతియును, భావోద్రేకముల్‌మాయు, యి
ప్పుదు నీయున్కికి జీవరాశియిక, యోపాపాత్మ! శ్రీరాము, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

61. ఇదినాపూర్వ విశేషమౌసుకృతమోయీ! రామచంద్రుండు, తా
నదె రాడంచు దలంచి నాను! యిటులోనన్నాదుకోనెంచి, వ
చ్చె దయావార్ధి యతండు, మారుతియుచేసెన్ యింతయున్ రావణా!
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

62. చదురుల్ వేసిరి, వార్ధితీరమున, యాచండోగ్రదీప్తాభిరా
మ దివామూర్తులు, దండితారులు, మహామాన్యుల్, మహోద్రేకులై
చదునైపోవును నీదులంక, దనుజా! చానుంటి వీవిప్పు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

63. ఇదినీపూర్వ విశేషమౌసుకృత మోయీ! రావణా! రాముచే
కదనానన్ చదియంగ, యెట్టిదగు స్వర్గంబబ్బు? నీ కర్మ, సం
పదలింకేలర? లంకయేల? గొనుమా! భాగ్యంబునీ విప్పు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

56. మదమాతంగములున్, హరుల్, ముదముతో, మన్నించు యిల్లాండ్రు, యే
కొదువేలేని, యనంతభోగములతో, కోడండ్రతో, కాపురం
బది లంకంతయునౌచు, చెల్వమరగా, పొడైతివీబుద్ధి, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

57. నదులన్ గ్రుంకిన, పుణ్యక్షేత్రముల, సందర్శించినన్ గాని, యి
య్యదియౌ పాపముబోదు, యెంతకును, సౌఖ్యంబిద్దికాదౌర! మా
రద నీ మానస మింతయేని?దనుజా! రాముండు వే వచ్చె, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

58. కదనమ్మన్నను మాటలా? కపులతో, కాల్ద్రిప్పకన్, వారు దిం
పుదురోయీ! తలతిక్కనీకు, వలపున్ ప్రోదైన యా వెట్టి, పె
ద్దది కాకుండకమున్నె? నీవెఱుగుమా? దర్పంబులన్మాని, య
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

59. చదలన్ యాపృథురావమేమి? వినుమా! చండోగ్రబాహుండు, ఘో
ర దృశాకారుడు, మారుతాత్మజునిదౌ! రక్షోభయోత్పాదనా
రదనోగ్రాస్యభయంకరుండు, యదె! సంగ్రామోర్వితానిల్చె, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



44. విదితంబైనది కాద! రాఘవుభుజావిర్భూతి, యావార్థిపై
యుదయంపించెను సేతు వొక్కటి కపీ యూథంబుతోడ్తెచ్చి నీ
కిది సౌధోపరిభాగమందెకననాయెన్, ధూర్త! నీ చావుకున్
అదికోదండగుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

45. ఉదయం బౌనిక, తిగ్మకాంతులెసగన్ యుత్సాహియై యల్ల రా
మ దవాగ్నిచ్ఛటనింగి దాకుచును, ధూమంబొప్పదుర్దాంతమై
పొదలున్ లంక నిలింపు లింపుగొన దుర్బుద్ధీ! వినాశమ్మె, య
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

46. ఎదియోకట్టగవచ్చుమూటయని, యీహేయంపు కార్యంబు, నీ
యెదభావింపకజేసినావు, నిఖిలంబెల్గెత్తి వాపోయె, సం
పద పెంపారునె? రాక్షసాధమ! నిలింపద్వేషివౌ నీకు, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగుల్ యింక వర్షించురా!

47. అది కౌబేరము, పుష్పకంబుగొనిరా, యక్షేశుడా! యెందుకో
మది(క్రోధానలమార్చి, తాల్మిగొని, యామాన్యుండుసైరించె, య
ట్టిది కాదీ రఘు రాము క్రోధము, వధూటీ యశ్రు సంతప్త, మ
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగుల్ యింక వర్షించురా!

48. అది నీమూలబలంబెయౌనొ! యది మాయాయుద్ధమే యౌనొ! యె
ట్టిది యైనన్, రఘురామమూర్తి, శరధాటిన్ పూట కుంజాలునా!
నుదుటన్ వ్రాసె ఖరాదులట్లు, విధి కన్నుల్ గుట్టె, చానుంటి, వ
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

49. మది మాయారణ కోవిదుండనని, దుర్మార్గా! వివేచించితే!
అది నీకర్మ, యతండె లక్ష్మణుడు, యాయర్కుండు నాబొల్చి, నీ
మది సంతాపము సంఘటించు, సుతునిన్ ద్రుంచి, చూడట్టె, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

50. అదె ప్రాచీదిశ, వెల్గురేఖలవిగో, యభ్రంకషంబెల్ల, నిం
డె, దశాస్యా! యిక సీతబాయువెత, మూడెన్నీకు, సుగ్రీవయం
గద నీలాదుల గూడి, రాఘవుడు తాకాండీరుడై వచ్చె, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

51. మృదువౌరీతి వచించుచుంటి దితిజా! మేధావివైయుండి, యిం
తది యౌనొవ్వయదెట్లు జేసితివి, వేదాంతార్థసంవేదివే?
మదినూహింపుము యెంత యెంత యిదిరా! మాహేయులే మానినుల్
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!



52. చెదరెన్ స్వాప్నికమౌజగత్తు! అడుగో శ్రీరాముడేతెంచె, శా
రదహాసోల్లసనంబువాడు, నతిదీర్ఘంబైన కందోయితో
పదనౌయుగ్ర శరాలనీ శిరములన్ భజించు యుద్ధాన, న
య్యది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

53. అదియుగ్రంబగు యుద్ధభూమి, యచటన్, యబ్జాక్షుడౌ రాము,డం
గద సుగ్రీవులగూడి మంతనములన్, కార్యార్థియై సల్పు చుం
డు, దశాస్యా! నినుజంపి, తానెటుల, గండూషింపగా, నెత్తురుల్
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

54. ముదిమిన్పై కొనె, ముద్దుటాండ్రు యటుపై మోహంపు సంతానముల్
యెద, యేతీపియొ, రేపుచుండుగద, నీ యీయిట్టి మోహంబునన్
ప్రిదులున్ నీదగుయాచ్చకీర్తి దనుజా! ప్రేమింపరా! లోకమున్
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!

55. మదనోద్దామ గుణారవంబునకునై, ద్రూనైతిరాయేమి? యే
సుదతిన్గాంచిన కల్గునే? పుడమి చోద్యంపు కామమ్ము? నీ
కిదిపో, యెంత యుదారుడో! యొసగు నీకిక్ష్వాకుడే, మోక్షమో?
అది కోదండ గుణారవంబె! యసురా! యగ్నుల్ యింక వర్షించురా!